# షష్ట్యాబ్ది సీతారామయ్య




రచన:

"సంఘమిత్ర"



భువనేశ్వరి సాహిత్య నిలయం
దుర్గయ్యవీధి, అరండల్‌పేట, విజయవాడ - 520 002.

## డాక్టర్ పట్టాభి

ఆవేశపరులకేకాదు - మేధాశక్తి సంపన్నులకు కూడా ఆంధ్రావని పుట్టినిల్లు. రాజకీయ, సాంఘిక, సాహిత్యాది రంగాలలోను, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాలలోను తమ ప్రతిభా విశేషాలను ప్రదర్శించడం ద్వారా యావద్భారత జాతి మన్ననలను, విదేశ ప్రముఖుల ప్రశంసలనుఅందుకొన్న తెలుగు వారెందరో వున్నారు. వారిలో భారత జాతీయ స్వాతంత్రోద్యమంలో గణనీయమైనపాత్ర వహించి అగ్ర శ్రేణి నాయకుడుగా శాశ్వతయశస్సు నార్జించుకున్న డాక్టర్ భోగరాజు పట్టాభి శీతారామయ్య గారొకరు. ఆంధ్ర జాతిలో, మూర్తీభవించిన అభినివేశానికి ఆంధ్ర కేసరి ప్రకాశంగారు ప్రతిరూపం కాగా ఆంధ్రుల అఖండ మేధా శక్తికి డాక్టర్ పట్టాభిగారు నిదర్శనం.

## 4

బాల్యం-విద్యాభ్యాసం :

పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు తాలూకాలో గుండుగొలను అనే గ్రామం వున్నది. అదే పట్టాభిగారి స్వస్థలం. పట్టాభిగారి తండ్రి అక్కడ గ్రామ కరణంగా పనిచేసేవారు. ఆ పరిసరాలలో ఆయనకు మంచిపలుకుబడి ఉండేది. అయితే వారి కుటుంబం పెద్ద సంపన్నమైనది కాదు. కరణీకంవల్ల వచ్చే కొద్దిపాటి జీతంతో పట్టాభి తండ్రి తమ కుటుంబాన్ని గౌరవ మర్యాదలకేమాత్రం లోటు లేకుండా పోషించు కుంటూ వచ్చేవారు.

పట్టాభిగారి ప్రాథమిక విద్యాభ్యాసం గుండుగొలను లోనే సాగింది. తర్వాత ఏలూరులో ఆయన వున్నత విద్య నభ్యసించారు. అది కూడా పూర్తి అయిన తర్వాత ఆయన బందరువెళ్ళి నోబుల్ కళాశాలలో చేరారు. అప్పుడు ప్రఖ్యాత విద్యావేత్త, సంఘ సంస్కర్త రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు అక్కడ పనిచేసేవారు. వెంకటరత్నం నాయుడుగారి పేరు వినని ఆంధ్రులుండరు. ఈనాటికీ ఆయన శిష్యులెందరో అత్యున్నత పదవులలో వుండి వివిధ రంగాలలో దేశానికి, ప్రజలకు అమూల్యమైన సేవ చేస్తు న్నారు. నవ్యాంధ్ర నిర్మాతలలో రఘుపతి వెంకట రత్నం నాయుడుగారొకరనడములో యెంత మాత్రం అతిశయోక్తి లేదు. ఆ మహనీయుని వద్ద చదువుకునే సదవకాశం లభిం చింది పట్టాభిగారికి.

ఇక పట్టాభిగారిలో అఖండ మేధాశక్తి చిన్ననాటినుంచి ఆయన విద్యాభ్యాసంలోను, నడవడిలోను ప్రతిబింబించ సాగింది. ఏలూరులో ఉన్నత పాఠశాలలో చదువుకునే రోజులనుంచి ఆయన కేవలం పాఠ్యపుస్తకాలనేగాక లోకజ్ఞాన సముపార్జనకు దోహదంచేసే ఇతర పుస్తకాలను కూడా శ్రద్ధాభక్తులతో చదివి అవగాహన చేసుకొనేవారు. ఇదిగాక స్కూలులో జరిగే చర్చలు, సాంస్కృతిక కార్యక్రమాలు మొదలయినవాటిలో ఉత్సాహంతో పాల్గొనేవారు. దీని ఫలితంగా ఆయనకు వాగ్ధాటి విద్యార్థిదశలోనే అలవడింది. బందరు నోబుల్ కళాశాలలో చేరే సమయానికే ఆయనగారు మంచి వ్యక్తి అనిపించుకున్నారు. ఇక పాఠ్య పుస్తకాలను శ్రద్ధగా చదివి జీర్ణింప జేసుకొనడంలో ఆయనకు ఆయనే సాటి. ఆయన ఏక సంతాగ్రాహి. ఒకసారి చదివిన దానిని గాని, విన్న దానినిగాని యెంత కాలానికైనా మరచిపోయే వారు కాదు. ఈ లక్షణాలవల్ల ఆయన బందరు వెళ్ళిన కొద్ది రోజులకే రఘుపతి వెంకటరత్నంనాయుడుగారి ప్రత్యేక అభిమానాన్ని చూరగొన గలిగారు. పట్టాభిగారికి మహోజ్వల భవిష్యత్తు వున్నదన్న విషయాన్ని ఆనాడే గ్రహించగలిగారు వెంకటరత్నం నాయుడుగారు. సహజంగా తనకుగల మేధాశక్తికి, శ్రద్ధాశక్తులకు తోడు అలాంటి ప్రతిభావంతుడయిన ఉత్తమదేశికుడు లభించినప్పుడు యిక పట్టాభిగారి విద్యాభ్యాసం నిరాఘాటంగా సాగిపోవడంలో ఆశ్చర్య

్రది. 1896-97 సంవత్సరంలో పట్టాభిగారు ఎఫ్. లో ప్రథమశ్రేణిలో ప్యాసైనారు. దానిలో ఆయనకు షిప్ లభించింది. ఆ స్కాలర్‌షిప్‌తో ఆయన మద్రాస్ క్కడ క్రిస్టియన్ కాలేజిలో చేరారు.

మద్రాసు వెళ్ళేసరికి పట్టాభిగారి వాక్పటిమ మరింతగా ందింది. అప్పటికే ఆయన ఆంధ్ర భాషలతోపాటు ఉర్దూ కూడా బాగా నేర్చుకున్నారు. అంతేకాదు. టిలో ఏ భాషనయినా అనర్గళంగా ఉపన్యసించగల ర్యాన్ని ఆయన సంపాదించగలిగారు. ఆయన ఉపన్యా నయగరా జలపాత వేగంతో పోల్చవచ్చు. ఎదుటివారు వారయినా గంటల తరబడి వారిని తన అనర్గళమైన సంతో ముగ్ధుల్ని చేయగల అద్వితీయ ప్రతిభ ం ఆనాడే లభించింది.

రే మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి. ఏ. పరీక్షలో న తర్వాత ఆయన వైద్యవిద్య నభ్యసించి ఎం. బి. లో కృతార్థులయ్యారు.

పట్టాభిగారు క్రిస్టియన్ కళాశాలలో బి. ఏ. చదువు రోజులలోనే వివాహం జరిగింది. కాకినాడలో ప్రసిద్ధ ాదిగా పేరుపొందిన గంజాం వెంకటరత్నం పంతులు మార్తె నిచ్చారు.

ఈ వివాహంతో పట్టభిగారు ఉన్నత విద్యాభ్యాసం చేయడానికి ఆర్థికంగా అవకాశం లభించింది. అందువల్ల చిక్కులను ఎదుర్కొనవలసిన అవసరం లేకుండా ఆయన వైద్య విద్య నభ్యసించి అందులో కృతార్థులయ్యారు.

## వై ద్య వృ త్తి :

మద్రాసులో వైద్యవిద్యలో ఉత్తీర్ణులయిన తరువాత ఆయన బందరులో ప్రాక్టీసు ప్రారంభించారు. అచిరకాలం లోనే ఆయన అత్యంత సమర్థతగల వైద్యుడుగా పేరు పొందారు. పైగా ఆయన హస్తవాసి మంచిదన్న విశ్వాసం చాలా మందికి కుదిరింది. దానితో వృత్తిపట్ల ఆయనకు అన్నింటికంటె విశేషమేమిటంటే వైద్యునికుండవలసిన కొన్ని అత్యంత ప్రధాన లక్షణాలు ఆయనలో మూర్తీభవించాయి. వాటిలో మొదటిది సేవానిరతి. ప్రయివేటుగా ప్రాక్టీసు చేసుకునే వైద్యులలో చాలామంది ధనార్జననే పరమావధిగా పెట్టుకున్నారన్నది జగద్విదితం. ఇలా ప్రయివేటుగా వైద్యవృత్తిని నిర్వహించేవారు తమ భుక్తికోసం డబ్బు సంపాయించుకొనడము అవసరమన్నమాట నిజమే. కాని అంత మాత్రంలో ప్రజల్ని పీడించడం ముఖ్యంగా వైద్యులకు తగనిపని. ధనార్జనకంటె సేవాదృష్టినే ఎక్కువగా కలిగి వుండవలసిన వృత్తి

వైద్యం. ధనవంతుల వద్దనుంచి న్యాయ సమ్మతంగా వైద్యులు డబ్బు తీసుకొనడంలో ఏమీ పొరపాటు లేదు. కాగా పేదవారిని కూడా తాము కోరినంత డబ్బు తెమ్మనడం డబ్బు ఇవ్వలేని వారికి వైద్యం చేయడానికి నిరాకరించడం వైద్య ధర్మానికి పూర్తిగా విరుద్ధం.

ఈ నీతి సూత్రాలన్ని అక్షరాల పాటించిన వైద్యుడు పట్టాభిగారు. ధనవంతుల వద్ద నుంచి తనకు న్యాయంగా రావలసిన ఫీజు వసూలుచేసేవారు. మధ్యతరగతి వారి వద్ద నుంచి వారెంత ఇవ్వగలిగితే అంత తీసుకునేవారు. అసలే ఇవ్వలేని పేదవారికి ఉచితంగా వైద్యం చేసేవారు. ఈ ఉదార స్వభావం ప్రజల్ని ఆయనవైపు తిప్పుకొనగలిగింది. దానితో లక్ష్మీకటాక్షం కూడా ఆయనకు బాగా కలిగింది. వైద్యవృత్తి వల్ల ఆయన లక్షలాది రూపాయలు విలువచేసే ఆస్తిపాస్తులు సంపాదించ గలిగారు.

## రా జ కీ య జీ వి తం :

బ్రిటిష్ ప్రభుత్వం బెంగాల్ ను రెండు భాగాలుగా విభజించడంతో దేశవ్యాప్తంగా బ్రహ్మాండమైన అలజడి ప్రారంభమయింది. అదే వందేమాతరం రూపంలో అన్ని మూలలకు విస్తరించింది. ఆంధ్రావని కూడా ఈ మహోద్యమంలో గణనీయమైన పాత్ర వహించింది. నిజానికి ఈ

ఉద్యమం ప్రజానీకంలో నవచైతన్యానికి కారణభూతమైనదని చెప్పవచ్చు. ఇంతేగాక ఈ ఉద్యమం విదేశీవస్తు బహిష్కరణకు, విదేశీ విద్యాభ్యాసం పట్ల ప్రాతికూల్యతకు దారితీసింది. మన రాష్ట్రంలో రాజమహేంద్రవరం, మచిలీపట్నం, విజయవాడ, కాకినాడ వంటి పట్టణాలలో ఈ ఉద్యమం బాగా నిర్వహించబడింది. వీటిలోనూ రాజమహేంద్రవరం, మచిలీపట్నం మరింత ప్రాముఖ్యం వహించాయి. అప్పటికే బందరు జాతీయ కళాశాల ఉన్నతస్థాయి నందుకొని ప్రశంసనీయమైన సేవ చేయసాగింది. ఈ కళాశాల అభివృద్ధికి కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు ప్రభృతులతో కలిసి పట్టాభిగారు అవిరళమైన కృషి సాగించారు.

ఇంతకూ ఆనాడు బయలుదేరిన బెంగాల్ విభజన వ్యతిరేకోద్యమం ఎంతో కాలం సాగలేదు. ప్రజల ప్రాతికూల్యాన్ని గమనించిన బ్రిటిషు ప్రభుత్వం తన తప్పును సవరించుకొని కొద్దికాలంలోనే తిరిగి బెంగాల్‌ను సమైక్యపరిచింది. అయితే యీ సందర్భంలో జరిగిన ఉద్యమం

మరువరాని మేలును చేకూర్చింది. అదేమంటే దేశంలోని అన్ని ప్రాంతాలలో గల అకలంకదేశభక్తులు ఈ ఉద్యమంలో పాల్గొన్నందున వారెవరో వెల్లడయింది. ఇలా ఆ సమయంలో వెలుగులోకి వచ్చిన తర్వాత భారత రాజకీయ రంగంలో ధృవతారగా విలసిల్లిన నాయకాగ్రేసరుడు మన పట్టాభిగారు.

సరే, కొంతకాలంపాటు పట్టాభిగారు బందరు పుర పాలక సంఘంలో సభ్యులుగా వున్నారు. అయితే అది ఆయన కోరి సంపాదించిన పదవికాదు. అసలు స్థానిక సంస్థలలో చేరి పనిచేయడం ఆయన మనస్తత్వానికి సరిపడని పని. అదీగాక దేశంలో పరాయి ప్రభుత్వం అధికారాన్ని చలాయిస్తుండగా యిలాంటి స్థానిక సంస్థలలో చేరి సక్రమంగా ప్రజలకు సేవచేయడానికి యెట్టి అవకాశం వుండదన్నది ఆయన నిశ్చితాభిప్రాయం. అందువల్లనే అతడు ఎన్నడూ కేంద్ర, రాష్ట్ర శాసన సభలలో ప్రవేశించలేదు. తను పదవులను అధిష్ఠించాలన్న అభిలాష అతనికి లేదు. ఆ అభిలాష వుంటే ఎన్నో ఉన్నత స్థానాలను అతను ఆక్రమించి ఉండేవారు. అలాకాక తాను బయటవుండి సవ్యంగా వ్యవహారాలు కొనసాగడానికి అవసరమయిన సముచిత సలహాల నందజేయడమే అతను తన కర్తవ్యంగా పెట్టుకున్నారు. అదైనా ప్రజలకు

ఉపయోగపడే విషయాలలోనే తన సలహాల నిచ్చేవారు గాని ప్రభుత్వానికి అనుకూలంగా వుండే సూచన లెన్నడూ చేయలేదు.

శాసన సభలలో కూడా కాంగ్రెసు సభ్యులు వివిధ విషయాలపై చర్చలు సాగించేటప్పుడు తమ వాదనలను సమర్థించుకోవడానికి అవసరమైన సమాచారాన్ని పట్టాభిగారి వద్ద నుండి పొందేవారట.

ఇలా ఆదినుంచీ పట్టాభిగారు పదవులను ఆపేక్షించక ప్రజాసౌభాగ్యాన్ని దేశకళ్యాణాన్ని కాంక్షించి నిస్వార్థ సేవ చేస్తూ అచిరకాలంలోనే ప్రముఖోద్యమ నాయకులలో ఒకరుగా పేరు తెచ్చుకున్నారు.

ఇలా వుండగా 1917వ సంవత్సరంలో డాక్టర్ అనిబిసెంట్ హోంరూల్ లీగ్‌ను స్థాపించింది. డాక్టర్ అనిబిసెంట్ పేరు వినని భారతీయులు సాధారణంగా వుండరు. భారత ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, వారి అభ్యున్నతి కోసం తన జీవిత సర్వస్వాన్ని ధారపోసిన విదేశ వనిత ఆమె. ఆమె ప్రారంభించిన హోంరూల్ లీగ్ ఉద్యమం తిరిగి దేశంలో పెద్ద అలజడి లేవదీసింది. కాని సామాన్య ప్రజలను పెద్ద యెత్తున ఆకర్షింపలేకపోయిన కారణంగా, ఇది

మరువరాని మేలును చేకూర్చింది. అదేమంటే దేశంలోని అన్ని ప్రాంతాలలో గల అకలంకదేశభక్తులు ఈ ఉద్యమంలో పాల్గొన్నందున వారెవరో వెల్లడయింది. ఇలా ఆ సమయంలో వెలుగులోకి వచ్చిన తర్వాత భారత రాజకీయ రంగంలో ధృవతారగా విలసిల్లిన నాయకాగ్రేసరుడు మన పట్టాభిగారు.

సరే, కొంతకాలంపాటు పట్టాభిగారు బందరు పురపాలక సంఘంలో సభ్యులుగా వున్నారు. అయితే అది ఆయన కోరి సంపాదించిన పదవికాదు. అసలు స్థానిక సంస్థలలో చేరి పనిచేయడం ఆయన మనస్తత్వానికి సరిపడని పని. అదీగాక దేశంలో పరాయి ప్రభుత్వం అధికారాన్ని చలాయిస్తుండగా యిలాంటి స్థానిక సంస్థలలో చేరి సక్రమంగా ప్రజలకు సేవచేయడానికి యెట్టి అవకాశం వుండదన్నది ఆయన నిశ్చితాభిప్రాయం. అందువల్లనే అతడు ఎన్నడూ కేంద్ర, రాష్ట్ర శాసన సభలలో ప్రవేశించలేదు. తను పదవులను అధిష్టించాలన్న అభిలాష అతనికి లేదు. ఆ అభిలాష వుంటే ఎన్నో ఉన్నత స్థానాలను అతను ఆక్రమించి ఉండేవారు. అలాకాక తాను బయటవుండి సవ్యంగా వ్యవహారాలు కొనసాగడానికి అవసరమయిన సముచిత సలహాల నందజేయడమే అతను తన కర్తవ్యంగా పెట్టుకున్నారు. అదైనా ప్రజలకు

ఉపయోగపడే విషయాలలోనే తన సలహాల నిచ్చేవారు గాని ప్రభుత్వానికి అనుకూలంగా వుండే సూచన లెన్నడూ చేయలేదు.

శాసన సభలలో కూడా కాంగ్రెసు సభ్యులు వివిధ విషయాలపై చర్చలు సాగించేటప్పుడు తమ వాదనలను సమర్థించుకోవడానికి అవసరమైన సమాచారాన్ని పట్టాభిగారి వద్ద నుండి పొందేవారట.

ఇలా ఆదినుంచీ పట్టాభిగారు పదవులను ఆపేక్షించక ప్రజాసౌభాగ్యాన్ని దేశకళ్యాణాన్ని కాంక్షించి నిస్వార్థ సేవ చేస్తూ అచిరకాలంలోనే ప్రముఖోద్యమ నాయకులలో ఒకరుగా పేరు తెచ్చుకున్నారు.

ఇలా వుండగా 1917వ సంవత్సరంలో డాక్టర్ అనిబిసెంట్ హోంరూల్ లీగ్‌ను స్థాపించింది. డాక్టర్ అనిబిసెంట్ పేరు వినని భారతీయులు సాధారణంగా వుండరు. భారత ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, వారి అభ్యున్నతి కోసం తన జీవిత సర్వస్వాన్ని ధారపోసిన విదేశ వనిత ఆమె. ఆమె ప్రారంభించిన హోంరూల్ లీగ్ ఉద్యమం తిరిగి దేశంలో పెద్ద అలజడి లేవదీసింది. కాని సామాన్య ప్రజలను పెద్ద యెత్తున ఆకర్షింపలేకపోయిన కారణంగా, ఇది

కూడా ఎక్కువ రోజులు నిలువలేదు. అయినా మంచి ఆశయాలతో ప్రారంభించబడిన యీ ఉద్యమాన్ని జయప్రదం చేయడానికి నడుంకట్టిన తెలుగువారిలో పట్టాభిగారొకరు. అతను తన శక్తి సామర్థ్యాలన్నింటిని వినియోగించి దీని అభివృద్ధికి పాడుపడ్డారు. అతనికృషి అనిబిసెంట్‌కిఅమితానందం కలిగించింది. పట్టాభిగారికి ఉజ్వలమైన రాజకీయ భవిష్యత్తు కలదని ఆనాడే ఊహించింది అనిబిసెంటు.

భారతదేశంలోని వివిధ భాషా ప్రాంతాలలో ఒకటైన ఆంధ్రావని విషయంలోనూ, విస్తీర్ణంలోను, సహజవనరుల విషయంలోను, ఖనిజ సంపత్తి విషయంలోను ఏ యితర ప్రాంతానికి తీసిపోదు సరికదా చాలా ప్రాంతాలకంటె అగ్ర తాంబూలాన్ని అందుకుంటుంది. అయినా చిరకాలంపాటు ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రానికి నోచుకోలేదు. ఆంధ్రప్రాంతం కూడా మద్రాసు రాష్ట్రంలో భాగంగానే వుండేది. ఆంధ్రుడు తన వ్యక్తిత్వాన్ని కోల్పోయి మద్రాసీగా పిలవబడేవాడు. ఆంధ్రప్రాంతంలో పన్నులద్వారా వసూలు చేసిన సొమ్ములో అధికభాగం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల అభివృద్ధికి వినియోగించబడటం తెలుగు దేశాన్ని నిర్లక్ష్యం చేయడం జరిగేది. ఉమ్మడి మద్రాసు ప్రభుత్వంలో ముఖ్యంగా తమిళులదే పైచెయ్యి అయినందున

మనకు జరిగే అన్యాయాలను మనం ఎత్తి చూపించినా ఎవరూ పట్టించుకునేవారు కాదు.

ఈ పరిస్థితి నంతను గమనించి కొందరు ఆంధ్ర ప్రముఖులు ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని యెలాగయినా సంపాదించాలని కంకణం కట్టుకుని అందుకొరక ఉద్యమాన్ని లేవదీశారు. **1952**వ సంవత్సరం నాటికి యీ ఉద్యమం తీవ్ర రూపం ధరించింది. ఆ సంవత్సరంలోనే పట్టాభిగారు ఈ ఉద్యమంలో చేరి దాని కార్యకలాపాలలో ప్రముఖ పాత్ర వహించారు. ఆ సమయంలో అతను వివిధ ప్రాంతాలలో పర్యటించి ఆంధ్ర రాష్ట్రోద్యమాల లక్ష్యాలను, ప్రత్యేక రాష్ట్ర ఆవశ్యకతను వివరిస్తూ పెక్కు ఉపన్యాసాలిచ్చారు. అతని ఉపన్యాస ధోరణి అనన్యసామాన్యమైనదని ఇదివరకే తెలుపబడింది. ఎన్ని వేలమందినయినా గంటలతరబడిగ ఆకట్టి కూర్చోబెట్టగల మహా ప్రవాహం అతని ఉపన్యాసము. అందువల్ల సామాన్య ప్రజల నుంచి పండితుల వరకు అతని వుపన్యాసమంటే చెవికోసుకునేవారు. స్వభావ సిద్ధంగా తనకు లభించిన ఈ శక్తిని అతను స్వరాష్ట్ర ఉద్యమంకోసం సద్వినియోగం చేశారు. అప్పుడాయన వివిధ ప్రాంతాలలో యిచ్చిన ఉపన్యాసాలవల్ల తాము సర్వతోముఖంగా అభివృద్ధి చెందటానికి ప్రత్యేక రాష్ట్రం యెంతైనా అవసరమన్న విషయాన్ని ప్రతి ఆంధ్రుడు గుర్తించాడు. అది

ుదలు ఆంధ్రోద్యమ నాయకులలో ప్రముఖుడుగా ఈయన
ుగులోకి వచ్చారు.

త్రికా నిర్వహణ

పట్టాభిగారు గొప్ప ఉపన్యాసకుడు మాత్రమేగాక
త్యంత ప్రతిభావిశేషాలుగల రచయిత. ఆంధ్ర, ఆంగ్ల
షలు రెండింటిలోను అతనికి సమానమైన ప్రావీణ్య
ున్నది. అందువల్లనే అతను పత్రికా రంగంలో కూడా
ప్రసిద్ధులుగా పేరు పొందగలిగారు.

మాతృదేశ దాస్యవిమోచనను, స్వరాష్ట్ర సముపా
నకు కృషిచేయడానికి, దీనావస్థలోనున్న భారత ప్రజల
ిగతులు మెరుగుపడేటట్లు యత్నించటానికి పత్రికలు
ణనీయమైన సాధనాలని అతను భావించారు. ఈ దృష్టి
ోనే పట్టాభిగారు బందరునుంచి "జన్మభూమి" అన్న పేరుతో
క ఇంగ్లీషు వారపత్రికను ప్రారంభించారు.

పత్రికా నిర్వహణ సాధారణమయిన విషయంకాదు.
ందులోను ఆ కాలంలో పత్రికలను నిర్వహించడమంటే
ారీ కష్టంగా ఉండేది. ఇక ప్రభుత్వ వ్యతిరేక విధానాలను
వలంబించే పత్రికల సంగతి వేరేచెప్పనవసరంలేదు. ఎలాంటి
దుపాయాలు లేని ఆ రోజులలో పత్రికల నిర్వహణకు
వసరమైన సాధన సంపత్తిని సమకూర్చుకొనడం ఒక ఎత్తు
ిగా ప్రభుత్వం బారినుంచి వాటికి రక్షణ కల్పించుకొనడం

ఒక ఎత్తుగా ఉండేది. అలాంటి సమయంలో ప్రారంభించారు అతను జన్మభూమి పత్రికను.

ఇంగ్లీషులో జన్మభూమి. తెలుగులో ముట్నూరి కృష్ణారావుగారికి కృష్ణాపత్రిక. ఈరెండూవారపత్రికలే. రెండూ బందరునుంచి నడుస్తున్న పత్రికలే. నిర్వాహకులిద్దరూ నిస్వార్థ దేశసేవకులే. ఈ రెండు పత్రికలు ప్రజలకు చేసిన సేవ అపారం. అందులో పట్టాభిగారి జన్మభూమి ఇంగ్లీషు పత్రిక అయినందున దేశంలోని యుతర ప్రాంతాలకుకూడా వెళ్ళేది. దానిలో వెలువరచబడే అభిప్రాయాలను బ్రిటిష్ ప్రభుత్వం శ్రద్ధతో పరిశీలించేది. అందులోను పట్టాభిగారు మాటలతోను, వ్రాతలలోను కూడా ప్రతి విషయాన్ని నిర్దిష్టంగా, తేటతెల్లగా కుండ బ్రద్దలుకొట్టినట్లు స్పష్టంచేసేవారు. అందువల్ల అచిర కాలంలోనే జన్మభూమి విశేషంగా ప్రచారంలోకి వచ్చింది. జాతీయోద్యమ చరిత్రలో జన్మభూమి పత్రిక ఒక విశిష్ట స్థానాన్ని సముపార్జించుకొన్నది.

## ప్ర జా హి త సం స్థ లు

మన రాజకీయ నాయకులలో దేశ ఆర్థికాభివృద్ధి కృషి పట్ల తమ దృష్టిని కేంద్రీకరించినవారి సంఖ్య బహు స్వల్పం. ఆ కొద్దిమందిలో మొట్ట మొదట పేర్కొనవలసిన వ్యక్తి పట్టాభిగారు. రాజకీయంగా దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించినా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించలేకపోతే అది నిరుపయోగం కాగలదని అతను గుర్తించారు. ఈ దృష్టితోనే ఆర్థికాభివృద్ధికి

దోహదంచేసే ప్రజాహిత సంస్థలు కొన్నిటిని నెలకొల్పాలని సంకల్పించారాయన. అందులోను తాను ఆంధ్రుడైనందునను ఆంధ్రావనిలో చెప్పుకొనదగిన సంస్థలేవీ లేనందునను యిక్కడే కొన్నింటిని స్థాపించాలని నిశ్చయించుకున్నారాయన.

ఒక సంస్థను నెలకొల్పి దానిని జయప్రదంగా నిర్వహించుకోవడము సామాన్య విషయంకాదు. కాని సంకల్ప సిద్ధులైన పట్టాభిగారు అవలీలగానే పెక్కు సంస్థలను స్థాపించ గలిగారు. ఈనాటికీ అవి అవిచ్ఛిన్నంగా దినదినాభివృద్ధి చెందుతున్నవి. ఆంధ్రబ్యాంకు, భారతలక్ష్మి బ్యాంకు ఇందుకు ప్రత్యక్ష ఉదాహరణలు. అలాగే భీమా వ్యాపారంలో కూడా ఆంధ్రులకు ప్రవేశం కల్పించడంకోసమై ఆంధ్ర ఇన్సూరెన్స్ కంపెనీని, హిందూస్తాన్ ఇన్సూరెన్స్ కంపెనీని స్థాపింప చేశారు. ఇవిగాక ఆయన "హిందూస్తాన్ పబ్లిషింగ్ హౌస్" అన్న పేరుతో ఒక గ్రంథ ప్రచురణ సంస్థను స్థాపింప చేశారు. తాను వ్రాసిన గ్రంథాలన్నిటిని అతను ఉచితంగా ఈ సంస్థకు యిచ్చి ప్రకటింపచేసి దీని అభివృద్ధికి మార్గం చూపించారు.

ఆర్థిక విషయాలలో అంచనాలకు సరిపడినట్టు వ్యవహరించాలంటే పొదుపు చాలా అవసరం. ఆయన పొదుపును పాటించడంలో ఆదర్శప్రాయులని చెప్పవచ్చు. ఎంత

ఉన్నత పదవిలో వున్నప్పుడైనా ఆయన తనకు నిత్యంవచ్చే వుత్తరాల కవర్లను చించి సాపుచేసి వాటి వెనుక భాగాల్ని ఏదైనా వ్రాసుకోవడానికి ఉపయోగించేవారట. దీనిని బట్టి ఆయన ఎంత పొదుపుగా వుండేవారో విదితమవుతున్నది. అలా అని అవసరమైన వాటికి వెనుదీసే తత్త్వంకాదాయనిది. ఏది ఎంత వరకు అవసరమో నిర్ణయించుకొని ఆ ప్రకారం చేయడములోనే వున్నది ఆయన గొప్పతనం. అర్ధశతాబ్దం పైగా జరిపిన తన ప్రజాహిత జీవనంలో కూడా ఆయన ఇతరుల సొమ్ము ఒక పైసా కూడా ఆశించలేదు. తనది తాను జాగ్రత్తపరచుకుంటూ సేవా కార్యక్రమాలకు అవసరమైనంత మేరకు వ్యయపరుస్తూ "భేష్" అనిపించుకున్నారాయన. ఇటువంటి వ్యక్తి కనుకనే యిన్ని పెద్ద సంస్థలను స్థాపించగలిగారు. ఈ మాత్రం మంచి సంస్థలు ఉద్భవించడానికి కారణభూతులైనందుకు ఆయనకు యావదాంధ్రదేశం ఋణపడి వున్నదని చెప్పక తప్పదు.

సత్యాగ్రహోద్యమం :

గాంధీమహాత్ముడు దక్షిణాఫ్రికానుంచి తిరిగి వచ్చి భారత రాజకీయరంగంలో ప్రవేశించడంతో దేశంలోనూ, కాంగ్రెసు సంస్థలోను కూడా నూతన చైతన్య ఏర్పడింది. **1920**వ సంవత్సరంలో గాంధీజీ సత్యాగ్రహోద్యమాన్ని

ప్రారంభించారు. ఇది అంతకు ముందు నిర్వహించబడిన జాతీయోద్యమాలన్నిటికంటె పెద్దది.

వందేమాతరం ఉద్యమంలోను. హోంరూల్ లీగ్‌లోను పాల్గొన్న దేశభక్తులంతా ఈ ఉద్యమంలో చేరారు. వీరికి తోడు ఎంతో మంది విద్యార్థులు, సామాన్య ప్రజలు కూడా దీనికి చేయూత నిచ్చారు. ఈ సత్యాగ్రహోద్యమ లక్ష్యాలను ప్రజాబాహుళ్యానికి విశదపరచి వారి సహాయ సద్భావాలను సమీకరించడానికి పట్టాభిగారు అద్వితీయమైన కృషి సాగించారు. ఆ సమయంలోనే ఉద్యమ సాఫల్యానికి కోటి రూపాయలు నిధిని సేకరించాలని నిశ్చయించాడు గాంధీజీ. పట్టాభిగారు తెలుగుదేశములోని ప్రతి పట్టణానికి పల్లెకువెళ్ళి అస్పృశ్యతా నిర్మూలనా అవసరాన్ని గురించి ఖద్దరుప్రాముఖ్యాన్ని గురించి విదేశీవస్తు బహిష్కరణ ఆవశ్యకత గురించి ప్రజలకు బోధనచేసి గాంధీజీ ప్రారంభించిన నిధికి విరివిగా విరాళాలు సేకరించారు. ఆ సమయంలో పట్టాభిగారు చూపిన కార్యదీక్షత గాంధీజీని ముగ్ధుడ్ని చేసింది. నాటినుంచి వీరిద్దరి మధ్య సన్నిహితత్త్వం క్రమంగా వృద్ధిచెందింది. ఎంతటి క్లిష్టస్థితి నైనా మహాత్ముడు పట్టాభిగారుసలహాతీసుకొనేవాడు. ఇక మహాత్ముని ఆశయాలకు, ఆదర్శాలకు, లక్ష్యాలకు సరిపడిన వ్యాఖ్యానాన్ని అందచేసిన ఘనత పటాభిగారిదే. మహాత్ముడు ఏ వుద్యమాన్ని తలపెట్టినా ఆయన ఏ అభిప్రా

యంతో దాన్ని ప్రారంభిస్తున్నారో ముందుగా గ్రహించేవారు పట్టాభిగారు. అందువల్ల అందరికంటె ముందుగా మహాత్ముని పిలుపునకు ఆయన సమాధానమిచ్చేవారు.

1930వ సంవత్సరంలో మహాత్ముడు దేశవ్యాప్తంగా వుప్పు సత్యాగ్రహం ప్రారంభించాడు. పేదప్రజలు అత్యధిక సంఖ్యలోవున్న ఈ భారతదేశంలో ప్రతివారు నిత్యం వాడు కునే వుప్పుమీద ప్రభుత్వం పన్ను విధించడం అక్రమమని ఉప్పు పన్నును వెంటనే రద్దుచేయాలని ఎన్నోసార్లు మహా త్ముడు ప్రభుత్వాన్ని హెచ్చరించాడు. కాని ప్రభుత్వం ఆ హెచ్చరికను పెడచెవిన పెట్టింది. ఇక గత్యంతరంలేక ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించాడాయన. ఈ ఉద్యమాన్ని దేశం లోని కోట్లాది ప్రజలు సంతోషంతో బలపరచారు.

ఆంధ్రప్రాంతలలో ఈ మహోద్యమం జయప్రదము కావడానికి డాక్టర్ పట్టాభి, ఆంధ్రకేసరి, ప్రకాశం, మహర్షి బులుసు సాంబమూర్తి, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు వంటి నాయ కులు గావించిన కృషి అమోఘం.

గాంధిగారి ముఖ్య అనుచరుడైన పట్టాభిగారు తెలుగు దేశంలోనేగాక యితర ప్రాంతాలలో కూడా పర్యటించి ఉప్పు

సత్యాగ్రహ లక్ష్యాన్ని, దాని ఆవశ్యకతను సామాన్య ప్రజలకు బోధించి వారిని ఉద్యమానికి సమాయత్తపరచడంలో గణనీయమైన పాత్ర వహించారు.

ఇక్కడమరొకవిషయంపేర్కొనవలసియున్నది. పట్టాభిగారు ఆంధ్ర, ఆంగ్లభాషలలో మంచిప్రావీణ్యం కలిగినవ్యక్తి అని పైన సందర్భవశాత్తు పేర్కొనబడింది. ఇంకా పెక్కు భాషలలో కూడా ఆయన పేరెన్నికగన్న పండితుడు. ముఖ్యంగా హిందీలో ఆయనకుగల ప్రావీణ్యం ఉత్తరాది వారినే ఆశ్చర్యచకితుల్ని చేసేది. ఆభాషలలో కూడా ఆయన అనర్గళంగా ఉపన్యసించేవారు. అందుచేత ఇతర ప్రాంతాలలో ఉపన్యాసాలివ్వడానికి వెళ్ళినా అక్కడి ప్రజల్ని ఆయన అతి సులభంగా ఆకర్షించేవారు. ఈ ఉప్పుసత్యాగ్రహ ఉద్యమ సందర్భంలో ఆయన జరిపిన కృషివల్ల మహాత్మునికి ఆయన మరింత సన్నిహితులయ్యారు.

ఇలా పటాభిగారు పాల్గొన్న ఉద్యమాలన్నింటిని పేర్కొనాలంటే చిన్న పుస్తకం సాధ్యంకాదు. ఒక్కమాటలో గాంధీజి భారత రాజకీయరంగంలో ప్రవేశించి కాంగ్రెసు సంస్థకు నాయకత్వాన్ని వహించినది మొదలు దేశానికి స్వరాజ్యము సిద్ధించిన 1947 సంవత్సరము అగస్టు 1వ తేదీ వరకు వివిధ సమయాలలో నడిచిన అన్ని జాతీయోద్య

మూలలోను ఆయన పాల్గొన్నారు. పాల్గొనడమేకాదు, విశిష్ట మైన పాత్రలను నిర్వర్తించారు. అనేకసార్లు కారాగారశిక్ష అనుభవించారు. ఆదినుంచి అంతంవరకు ఆయన మహాత్ముని కాంగ్రెసు సంస్థకు నమ్మినబంటుగానే విశ్వాసంతో వ్యవహరిస్తూ వచ్చారు. గాని మధ్యలో అభిప్రాయ భేదాలవల్ల పార్టీలు మార్చుకొనడం వంటి తొందరపాటు చర్చలకు దిగ లేదు. ఇది ఆయన దూరదృష్టికి రాజనీతిజ్ఞతకు చక్కటి నిదర్శనం.

రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షత :

కాంగ్రెసుపట్ల అచంచల విశ్వాసంతో పనిచేసిన కారణంగానే పటాభిగారు ఎన్నడూ కోరకపోయినా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షపీఠం ఆయనను వరించింది. ఆ రోజులలో ఆ పదవిని ఆయన అత్యంత సమర్థతతో నిర్వహించి రాష్ట్రములో కాంగ్రెసు సంస్థను పటిష్టం చేయడానికి తన యావత్ శక్తిని వినియోగించారు.

పోతే, త్రిపురలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభ అధ్యక్షపదవికి నేతాజీ సుభాస్‌చంద్రబోస్‌తో పటాభిగారు పోటీచేసారు. ఇది పదవీకాంక్షతో ఆయన చేసిన పోటీకాదు. పార్టీలోని ఇతర అగ్రనాయకుల ఆదేశానుసారం ఇందుకాయన సిద్ధపడవలసి వచ్చింది. కాని ఆ ఎన్నికలలో

అయన గెలవలేదు. అప్పుడు మహాత్ముడు "పటాభి ఓటమి నా ఓటమి" అని పేర్కొనడాన్నిబట్టి ఆయనపట్ల మహాత్మని కెంతటి ఆదరాభిమానాలున్నవో విదితం కాగలదు.

సంస్థానాల సమస్య :

స్వరాజ్యం సిద్ధించడానికి పూర్వం మన దేశంలో సుమారు అయిదువందల వరకు స్వదేశ సంస్థానాలుండేవి. ఆ సంస్థానాల అధిపతులు ప్రజల క్షేమాన్ని చూడకపోవడమే గాక వారిని నానా విధాల హింసపెట్టేవారు. అసలే పేదరికంలో అవస్థపడే రైతులను తదితరులను వారు మరింత పీడించి పన్నుల రూపంలోను, ఇతర రూపాలలోను వారివద్ద నుంచి డబ్బు వసూలు చేసేవారు. వారి పరిపాలన నిరంకుశంగా ఉండేది. ఈ సంస్థాన ప్రజల స్థితిగతులను ఆయన విశేషాసక్తితో పరిశీలించి వారి హక్కులకోసం పెద్ద ఎత్తున పోరాటం సాగించారు.

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత స్వదేశీ సంస్థానాలను భారత ప్రభుత్వం రద్దుచేయడం: ఆ ప్రజల కష్టాలకు భరతవాక్యం పాడడం జరిగిందంటే ఆనాడు ఆయల వంటి నాయకులు జరిపిన కృషి దీనికి మూలకారణమని చెప్ప వచ్చు.

ఆంధ్రైక్యతకు కృషి:

ఆంధ్ర రాష్ట్రోద్యమం ఎలా ప్రారంభమైనదో ఇంతకు ముందు పేజీలలో కొంతవరకు పేర్కొనబడింది. ఇక ఈ ఉద్యమానికి సంబంధించిన మరికొన్ని వివరాలను గురించి యిక్కడ తెలుసుకుందాము.

అసలు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలోనే గాక మొత్తం దేశాన్ని భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభజించాలన్న విషయంలో పట్టాభిగారు ఆది నుంచి కృషిసాగిస్తూ వచ్చారు. ఈ సమస్యపై ఆయన ఒక సందర్భంలో చేసిన ప్రసంగం సారాంశం యిక్కడ పొందుపరచబడింది. ఆయన ఇలా తెలిపారు.

"భారతదేశాన్ని భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభజించవలసి వున్నది. ఇలా చేయడంతో మద్రాసు, బొంబాయి సెంట్రల్ ప్రావిన్సెన్స్‌కు బదులు ఆంధ్ర, కర్ణాటక, తమిళ కేరళ, మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలు అవతరిస్తాయి."

"ఇప్పుడు ఆంధ్ర ప్రజలలో అధిక సంఖ్యాకులు మద్రాసు రాష్ట్రంలోను, కొందరు నైజాం సంస్థానంలోను విడివడివున్నారు. ఒకేభాష మాట్లాడే యీ ప్రజలందరిని ఏక పరిపాలనా విధానంకోరి తేవడం అవసరం. ఇలా దేశం యావత్తు భాషాప్రయుక్త రాష్ట్రాలుగా పునర్నిర్మించబడితే

గాని అన్ని ప్రాంతాలవారు సర్వతోముఖంగా అభివృద్ధి చెందడం సాధ్యంకాదు. ఏ రాష్ట్రపు శాసనసభలలో ఆ రాష్ట్ర భాషనే ఉపయోగించాలి. విద్యాబోధన మాతృభాషలోనే సాగాలి."

ఇదాయన యేనాడో వెలిబుచ్చిన అభిప్రాయం. ఈ వాదాన్ని పట్టాభిగారు కాంగ్రెసు సమావేశాలలో యెన్నో సార్లు ఉద్ఘాటించి తుదకు కాంగ్రెసుపార్టీచే యీ సిద్ధాంతాన్ని ఆమోదింపజేశారు.

ఇంతే ఆంధ్రరాష్ట్ర విషయంలో పరిశీలిద్దాము. ఈ సమస్యకు సంబంధించిన కొన్ని ముఖ్యాంశాలపై ఆంధ్రుల లోనే కోస్తా ప్రాంతం వారికి, రాయలసీమ ప్రాంతంవారికి తీవ్ర విభేదాలేర్పడ్డాయి. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వర రావు పంతులు, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు వంటి నాయకులు ఎంత యత్నించినా ఈ అభిప్రాయ భేదాలు పరిష్కారం కాలేదు.

అప్పుడు మహామేధావి అయిన మన పట్టాభిగారు ఈ సమస్యను-గురించి జాగ్రత్తగా ఆలోచించి తుదకొక ఒప్పం దాన్ని రూపొందించారు. దానిని శ్రీబాగ్ ఒడంబడిక అంటారు. మద్రాసులో కాశీనాధుని నాగేశ్వరరావుగారి గృహం పేరు శ్రీబాగ్, అక్కడ ఈ ఒప్పందం కుదిరినందుకు దీనికి శ్రీబాగ్ ఒడంబడిక అని పేరు వచ్చింది. పట్టాభిగారు

రూపొందించి ఉభయపక్షాలచేతను అతికష్టం మీద ఒ
చేసిన శ్రీ బాగ్ ఒడంబడికలోని షరతులు సంగ్రహంగ

విశ్వవిద్యాలయం: ఆంధ్రులలో వైజ్ఞానిక, సా
సమైక్యతను పెంపొందించడానికి, వైజ్ఞానిక క్షేం
ఆంధ్రావని కంతకు ఉపయోగపడేటట్టు చేయడానికి
ఆంధ్ర విశ్వవిద్యాలయ కేంద్రమొకటి విశాఖపట్నం
మరొకటి అనంతపురంలో ఏర్పరచాలి.

నీటి పారుదల కోస్తా జిల్లాతో సమానంగా వుం
రాయలసీమ, నెల్లూరు జిల్లాలలో వ్యవసాయ సదుపాయ
ఆర్థిక సౌకర్యాలను అభివృద్ధిపరచడానికి వీలుగా తుం
కృష్ణ, పెన్న నదుల పథకాల విషయంలో పది సంవ
వరకుగాని, అవసరమైతే ఇంకా ఎక్కువ కాలంగా
ప్రాముఖ్యం యివ్వాలి. నీటి పంపిణీ సమస్యపై వి
తలయెత్తినప్పుడు రాయలసీమ నెల్లూరు జిల్లాల అవ
ప్రాధాన్యమివ్వాలి.

శాసనసభలు : శాసన సభలలో జనరల్ స్థా
సీట్ల కేటాయింపు సందర్భంలో అన్ని జిల్లాలు సమా
నన్న సూత్రాన్ని పాటించాలి.

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు ప్రాధాన్యం
డానికి వీలుగా రాజధానిని ఒక ప్రాంతంలోను, హై
ఒక ప్రాంతంలోను, విశ్వవిద్యాలయాన్ని ఒక ప్ర

లోను నెలకొల్పాలి. వీటిలో ఏ ఏ కార్యస్థానాలు ఎక్కడ వుండాలన్న విషయాన్ని రాయలసీమవారే నిర్ణయించాలి.

ఇలా రూపొందించబడిన ఈ శ్రీ బాగ్ ఒడంబడికపై శ్రీయుతులు కడప కోటిరెడ్డి, భోగరాజు పట్టాభి సీతా రామయ్య. కొండా వెంకటప్పయ్య, పప్పూరి రామాచార్యులు, ఆర్. వెంకటప్పయ్య నాయుడు, హాలాహర్వి సీతారామరెడ్డి గారలు సంతకాలు చేశారు.

ఈ ఒప్పందంలోని షరతులను బట్టి చూస్తే అన్ని విషయాలలోను రాయలసీమవారికే ప్రాధాన్య మిచ్చినట్లు స్పష్టంగా కనిపిస్తుంది. అది నిజమే కూడా. కాని పట్టాభిగారి వంటి మేధావి యిలాంటి షరతులను తగినంత కారణము లేకుండా సృష్టిస్తారని భావించరాదు. కోస్తా ప్రాంతం సస్య శ్యామలమైనది. కాగా రాయలసీమ వాస్తవానికి రాళ్ళసీమ. అక్కడ సేద్యానికి పనికివచ్చే భూమి చాలాతక్కువ. అలాగే అక్కడి ప్రజలు కోస్తా ప్రాంతాలవారి కంటే అన్ని విషయా లలో వెనుకబడి వున్నారు. ఈ పరిస్థితులలో వారిని సంతృప్తి పరచి కూడగట్టుకొనకపోతే అసలు ప్రత్యేక రాష్ట్రానికే వారు అడ్డుతగలవచ్చు. అదీగాక వెనకబడినవారి భయాందోళనలను పోగొట్టి వారి సౌకర్యాల పట్ల ముందుగా శ్రద్ధవహించడం మిగతావారి ధర్మం. ఈ అంశాలన్నిటిని దృష్టిలో పెట్టుకునే ఆయన ఈ షరతులను రూపొందించారు.

ఈ శ్రీబాగ్ ఒడంబడిక ఎంతవరకు అమలు జరిగినది. దానిలోని ఏ ఏ అంశాలు కార్యరూపం ధరించాయి. ఏవి బుట్టదాఖలైనవి అన్న వివరణ యిప్పుడు అనవసరం అప్పటి పరిస్థితులనుబట్టి వారికి రాయలసీమ కోస్తా ప్రాంతంమధ్య సామరస్యాన్ని సాధించడంకోసమై ఆయన ఈ ఒడంబడికను తయారు చేశారు. ఈ దృష్టితోపరిశీలిస్తే పట్టాభిగారి మేధాశక్తి సునిశితమైనదని అంగీకరించక తప్పదు.

ఆనాడు పట్టాభిగారు కోస్తా రాయలసీమ ప్రాంతాల వారి మధ్య విభేదాలను ఇలా పరిష్కరించి వారిని ఏకత్రాటిపై నడిపించ గలిగినందుననే మద్రాసు శాసనసభ కాంగ్రెస్ పార్టీలో కూడా ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయం ఆమోదించ బడింది.

ఈ విధంగా ఆంధ్రులలో కోస్తా రాయలసీమ వారికి మధ్యగల విభేదాలను అంతంచేసిన తర్వాత ఇక స్వరాష్ట్ర సాధనకు ఉద్యమాన్ని మరింత తీవ్రతరం చేయడంలో ఆయన శక్తియుక్తులన్నిటిని వినియోగించారు.

కాంగ్రెస్ అధ్యక్షత :

ఇలా వుండగా భారత ప్రజాకోటి అసమాన త్యాగాల వల్ల గాంధీ, నెహ్రూ, పటేల్, పట్టాభి, ప్రకాశం, రాజన్ బాబు వంటి నాయకాగ్రేసరుల దీక్షాయుత కృషివల్ల 1947వ

సంవత్సరం ఆగష్టు 15వ తేదీన మనకు స్వరాజ్యం సిద్ధించింది అంటే కుటిలనీతికి పేరుపొందిన తెల్లవారు యిక ఈ గడ్డమీద తమకు స్థానంలేదని గుర్తించి వెళ్ళిపోయేటప్పుడైనా సవ్యంగా మనభూభాగాన్ని మనకు అప్పగించలేదు. అప్పుడు కూడా తమ రాజకీయ వ్యూహాన్ని పన్ని దేశాన్ని హిందూస్తాన్‌గాను, పాకిస్తాన్‌గాను రెండు ముక్కలు చేశారు. ఇది చాలక స్వదేశ సంస్థలన్నిటికి వాటి భవిష్యత్తును నిర్ణయించుకునే స్వాతంత్ర్యం ప్రకటించారు. ఈ రెండింటికి కూడా పట్టాభిగారు వ్యతిరేకులే. గాంధి, నెహ్రూ వంటి అగ్రనాయకులకు కూడా యిదేమాత్రం యిష్టంలేదు. కాని తప్పనిసరి పరిస్థితులలో వారిందుకు అంగీకరించవలసి వచ్చింది. ముస్లిం నాయకుడు జనాబ్‌జిన్నా బ్రిటిష్‌వారి యెత్తుగడలకు లొంగిపోయి తమకు ప్రత్యేకంగా పాకిస్తాన్ కావాలని మొండిపట్టు పట్టినందున యిక ఆ విషయంలో సామరస్య సాధనకు యెంత కృషిచేసినా లాభంలేదని మనవారు గ్రహించారు. పోతే తెల్లవారుముందు ఎలాగయినా యిక్కడనుంచి కదలి వెళ్ళిపోతే స్వదేశ సంస్థానాల సమస్యను పరిష్కరించుకొనవచ్చునన్న నిర్ణయానికి వచ్చారు. ఈ దృష్టితో దేశవిభజనకు కాంగ్రెసు నాయకులు అంగీకరించడం ఆ ప్రకారం 1947 ఆగస్టు 15వ తేదీన మనకు స్వాతంత్ర్యం సిద్ధించడం జరిగింది.

స్వాతంత్ర్యం సిద్ధించిన కొద్ది నెలలలోనే భారత దేశ ఉక్కుమనిషిగా జగద్విఖ్యాతినందిన సర్దార్ వల్లభాయి పటేల్ (అప్పటి కేంద్రప్రభుత్వ ఉపప్రధాని) తన అసాధారణ ప్రతిభావిశేషాలను, శక్తి సామర్థ్యాలను ప్రదర్శించి స్వదేశ సంస్థానాలను భారత ప్రభుత్వంలో విలీనం చేశారు. స్వదేశ సంస్థానాలలో ప్రజల ఇక్కట్లను రూపుమాపడానికి పట్టాభిగారు చేసిన అవిరళ కృషి ఈ రూపంలో ఫలితానికి వచ్చింది.

సరే, దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత 1949వ సంవత్సరంలో జయపూర్‌లో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభకు డాక్టర్ పట్టాభిగారు అధ్యక్షులుగా ఎన్నుకొనబడ్డారు. ఈ సుప్రసిద్ధ రాజనీతిజ్ఞుడు, అకళంక దేశభక్తుడు అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షస్థానాన్ని అలంకరించగలిగినందుకు యావద్భారతం అపరిమితానందం పొందింది. ఇక తెలుగుజాతి సంతోషానికి మేరలేదు. ఆనాడు ఆంధ్రులంతా పండుగ చేసుకున్నారనడం అతిశయోక్తికాదు. పైగా కాంగ్రెసు చరిత్రలో అప్పటికి ఆ గద్దె నలంకరించ గలిగిన తొలి ఆంధ్రుడు పట్టాభిగారే.

జయపూర్ కాంగ్రెసు మహాసభ వేదిక నుంచి పట్టాభిగారు గావించిన మహోపన్యాసం చారిత్రాత్మక మైనది. దేశాన్ని ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను గురించి ఆయన ఆ ఉపన్యాసంలో విపులీకరించి వాటి పరి

ష్కారమార్గాలను కూడా నిర్మాణాత్మకంగా సూచించారు. రాజనీతిలో ఆయన నిష్ణాతుడు పైగా వివిధ భాషలలో మంచి పండితుడు. అనర్గళంగా ఉపన్యసించగల మహావ్యక్తి. ఇక ఆయన ఉపన్యాసం ప్రజల్ని ఆకర్షించడంలో ఆశ్చర్యమేముంది? కాని ఆశ్చర్యకరమైన విషయ మేమంటే నిత్యం లక్షలాది ప్రజలను తన ఉపన్యాసాలతో ఆకట్టుకొనే మహత్తర శక్తిగల జవహర్‌లాల్ నెహ్రూ వంటి వారిని సహితం ఆయన ఉపన్యాసం విశేషంగా ఆకర్షించింది.

పట్టాభిగారు అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులయిన తర్వాత ప్రత్యేకాంధ్ర రాష్ట్రం విషయంలో కేంద్రంలో సంచలనాన్ని కలిగింపజేశారు. ఆయన కృషి ఫలితంగానే ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ విషయాల గురించి పరిశీలించడానికి ముగ్గురు అగ్రనాయకులతో ఒక కమిటీ ఏర్పడింది. దానినే జె.వి.పి. కమిటీ అంటారు. 'జె'అంటే జవహర్‌లాల్‌నెహ్రూ, 'వి'అంటే వల్లభాయిపటేల్, 'పి' అంటే పట్టాభి సీతారామయ్య.

ఈ ముగ్గురు నాయకులతో ఏర్పడిన ఈ కమిటీ అన్ని అంశాలను క్లుప్తంగా పరిశీలించిన తర్వాత ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని నిర్మించడం అవసరమని సిఫారసు చేసింది. ఇది ఆంధ్రులకు ఘనవిజయమనడానికి సందేహము లేదు. కానీ ఒక సంగతి. ఆంధ్ర రాష్ట్రానికి మద్రాసు

నగరం రాజధానిగా వీలులేదని ఆ నివేదికలో పేర్కొన బడింది. ఆంధ్ర రాష్ట్రానికి మద్రాసు నగరము రాజధానిగా వుండనవసరములేదని ఆంధ్ర కాంగ్రెసు సంఘము అంగీక రిస్తేనేగాని ప్రత్యేక రాష్ట్ర స్థాపనకు చర్యలు తీసికొనడం సాధ్యం కాదని ఆ నివేదికలో పేర్కొనబడింది. దానిపై ఏ పరిస్థితులలో ఆ షరతు పెట్టవలసి వచ్చిందో ఆయన తోటి ఆంధ్ర నాయకులకు వివరిస్తూ ప్రత్యేక రాష్ట్రం నిర్మించబడా లంటే అంతకంటే మార్గం లేదని పేర్కొన్నారు. ఏదో ఒక నాటికైనా హైదరాబాద్ ముఖ్యపట్టణంగా విశాలాంధ్ర అవత రించగలదని, అందువల్ల మద్రాసు నగర విషయంలో పట్టు బట్టడం మంచిది కాదని ఆయన ఆంధ్రులకు సలహా ఇచ్చారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు మద్రాసు నగరాన్ని వదులుకున్నట్టు తీర్మానించారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తొలిసారిగా కేంద్రప్రభుత్వము స్థాయిలో కృషి ప్రారంభ మయింది.

తర్వాత 1952వ సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం కోసం నిష్కళంక దేశభక్తుడు పొట్టి శ్రీరాములు గారు ఆమరణ నిరసనదీక్ష వహించారు. 59 రోజులపాటు ఆయన కఠోరదీక్ష వహించిన తర్వాత 1952 డిసెంబర్ 15వ తేదీన శ్రీరాములుగారు శాశ్వతంగా కన్నుమూశారు. ఈ సంఘటన యావదాంధ్ర ప్రజానీకాన్ని ఆవేశపూరితులను చేసింది. ఈ ఉద్రిక్తతను చల్లార్చడం ఎవరికి సాధ్యము

లేదు. తెలుగువారిలో కలిగిన ఈ ఆవేశం, ఈ ఉక్రోషము
్రలో ప్రధానామాత్యునికి ప్రభుత్వానికికూడా సంభ్రమా
ర్యాలు కలిగించాయి. దానితో 1952వ సంవత్సరము
ెబరు ఒకటవ తేదీనాటికి ప్రత్యేకాంధ్రరాష్ట్రం నిర్మించ
నికి తాము చర్యలు గైకొనగలమని ప్రధాని నెహ్రూ ప్రక
చినారు. ఆ ప్రకారమే కర్నూలు రాజధానిగా, ఆంధ్ర
రి ప్రకాశం పంతులుగారు తొలి ముఖ్యమంత్రిగా ప్రత్యే
ంధ్రరాష్ట్రం అవతరించింది. తర్వాత నైజాము సంస్థానము
రతదేశంలో విలీనం కావడంతో హైద్రాబాద్ రాజధానిగా
ధ్రప్రదేశ్ అవతరించింది.

మొత్తంమీద ఈ మహోద్యమం యావత్తు జయప్రదం
డానికి ఆయన గావించిన కృషిని తెలుగువారెన్నటికీ
రించలేరు. నవ్యాంధ్రానికి మహానాయకులుగా పట్టాభి
శంగార్ల పేర్లు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడ
వు.

భారత రాజ్యాంగంగా పరిషత్తు సభ్యులుగాను, పార్ల
టు సభ్యులుగాను కూడా పట్టాభిగారు గణనీయమైన సేవ
రు.

ధ రచన :

పట్టాభిగారు ఒకవైపు నిరంతరము రాజకీయ రంగము
ం, ఆర్థిక రంగంలోను విశేషంగా శ్రమపడి పనిచేస్తూనే

వేరొకవైపున పెక్కు అమూల్య గ్రంథాలను రచించారు. ఆయన వ్రాసిన కాంగ్రెసు చరిత్ర గాంధీ, నెహ్రూ, పటేల్ వంటి మహామహుల ప్రశంసలు పొందిన అత్యుత్తమ గ్రంథం. కాంగ్రెసు ఆశయాదర్శాలను, లక్ష్యాలను అవతరించినది మొదలు భారత రాజకీయరంగంలో కలిగిన పరిణామాలను తెలుసుకొనగోరేవారు అనేక కాలాలపాటు యింతకంటే ఉత్తమ గ్రంథాన్ని పొందలేరు.

పోతే ఆయన వ్రాసిన గాంధీజం - సోషలిజం, అన్నది మరొక ఉత్కృష్టమైన గ్రంథం. అలాగే గాంధీ నుండి వెలువడింది. ఇంకా మరికొన్ని ఉత్తమ గ్రంథాలను కూడా రచించారు ఆయన.

ఆయన గ్రంథాలతో ఒక విశిష్టత వున్నది. ఏ సమస్యను గురించి ఆయన ఎన్ని పేజీలు వ్రాసినా పాఠకులకు ఎంతమాత్రము విసుగుదల కనిపించలేదు. ప్రతి అంశాన్ని ఆయన క్షుణ్ణంగా చర్చించడముతోపాటు, అన్ని తరగతుల పాఠకులకు ఆసక్తికరంగా వుండే పద్ధతిలో రచన సాగించడమే దానికి ప్రధాన కారణము, ఇతరులు పది వాక్యాలలో

విషయాన్ని ఒక్క వాక్యములో ముగించడము ఆయన
మరొక ప్రత్యేకత. భాష, భావం ఒకదానితో మరొకటి
పరుగులెడతాయి. ఆయన రచనలలో, అందుకే
రచయితగా కూడా సుప్రతిష్ఠ నార్జించుకున్నారాయన.

కార్యక్రమం :

గాంధీజీ నిర్మాణ కార్యక్రమం పట్ల పట్టాభిగారికి
ఎనలేని అభిమానము వుండేది. ఆ నిర్మాణ కార్యక్రమం
లో చుమించు అన్ని అంశాలను పట్టాభిగారు ఆచరణలో
పెట్టడానికి సందేహంలేదు.

అస్పృశ్యతా నివారణ ఆయన ప్రధాన లక్ష్యాలలో
ఒకటి. అంటరానితనం నిర్మూలించబడితేనేగాని భారతదేశా
నికి ముక్తిలేదని చిన్నతనములోనే గ్రహించారాయన అందు
కే ఆ ఆదర్శాన్ని విరివిగా ప్రచారంలోకి తెచ్చి ప్రజలలో
మార్పు పరివర్తన కలిగించడానికి ఆయన చాలా పాటు
పడ్డారు. ఏ వేదిక నుంచి తాను ఉపన్యసించినా, ఎక్కడ నలు
గురితో మాటాడినా ఈ సమస్యను గురించి ప్రసావించి అస్పృ
శ్యతను పాటించడము మహా ఘోరమని ఎదుటివారికి

నచ్చజెప్పడానికి యత్నించేవారు. ముఖ్యంగా మన ఆంధ్రా వనిలోని గ్రామ ప్రాంతాలలో ఈ ఉద్యమ సాఫల్యానికి ఆయన గావించిన కృషి ప్రశంసనీయము.

పోతే ప్రజలలో త్రాగుడు అలవాటును తొలగించ డానికి ఆయన విశేషముగా పాటుపడ్డారు.

ఇక ఖాదీ పరిశ్రమ అంటే పట్టాభిగారికి ప్రత్యేకాభి మానము. ఆయన కృషి ఫలితముగానే అఖిలభారత చరఖా సంఘము శాఖ ఒకటి ఆంధ్రలో వెలిసింది. ఈ ఖాదీ ఉద్య మాన్ని వ్యాప్తిలోకి తీసుకురావడానికి కూడా ఆయన ప్రత్యేక శ్రద్ధ వహించారు. ఇలా నిర్మాణ కార్యక్రమములోని ప్రతి అంశాన్ని గురించి ఆయన పాటుపడ్డారు.

గవర్నర్ పదవి :

కాంగ్రెసు అధ్యక్షపదవి నుంచి విరమించిన తర్వాత డాక్టర్ పట్టాభిగారు కొంతకాలం మధ్యప్రదేశ్ గవర్నర్‌గా పనిచేశారు. 1952 నుండి 1956 వరకు ఆయన ఈ పద విలో వున్నారు.

స్వతంత్ర భారత రాజ్యాంగములో వాస్తవానికి గవ ర్నరుకు ఎట్టి అధికారాలు లేవు. ఆయన రాష్ట్రానికి పెద్ద మాత్రమే. అసలు అధికార పదవులంటేనే గిట్టని ఆయనకు

గవర్నరు పదవిని చేపట్టడము యిష్టంలేకపోయింది. కాని మహామేధాశక్తి సంపన్నుడైన ఆయన వంటి వ్యక్తిని గవర్నరుగా నియమిస్తే మధ్యప్రదేశ్ వంటి రాష్ట్రం క్లిష్ట పరిస్థితుల నుంచి బయటపడడానికి తగిన సలహాలు, సూచనలు లభించ గలవన్న ఆశతో కేంద్ర ప్రభుత్వం, నాయకులు ఆయనను బలవంతము మీద ఒప్పించి ఆ పదవికి నియమించారు. మరొకరికైతే గవర్నరు పదవికి పూలపాన్పువంటిదే కాని ఆయన దానిని పూలపాన్పుగా భావించలేదు. తనపై ఏదో కొంత బాధ్యత మోపబడిందని, ఆ బాధ్యతను తాను నెరవేర్చవలసి వున్నదని అతను అభిప్రాయపడ్డారు. ఆ దృష్టితోనే ఆయన ఆ రాష్ట్ర సమస్యలన్నిటిని క్షుణ్ణంగా పరిశీలించి వాటి పరిష్కారానికి తగు సూచనలను, సలహాలను అందజేస్తూ వచ్చారు. అతని అమూల్య సలహాలవల్ల ఆ రాష్ట్రం ఎన్నో సమస్యలను విజయవంతంగా ఎదుర్కొని సుస్థిరత్వాన్ని సాధించగలిగింది.

తమ చేతిలో పరిపాలనాధికారం లేకపోయినా రాష్ట్రాల అభ్యున్నతికి గవర్నర్లు ఎలాంటి పాత్ర వహించడానికి అవకాశమున్నదో స్వయంగా చూపించారు ఆయన. అందుకే ఈనాటికి ఆయనను ఆదర్శప్రాయుడయిన గవర్నరుగా పేర్కొనడం కద్దు.

అస్తమయం:

పెక్కు సంవత్సరాలపాటు దేశంలోని వివిధ రంగా

లలో గణనీయమైన సేవచేసిన పట్టాభిగారు 19
త్సరంలో శాశ్వతంగా కన్నుమూశారు.

ఆయన నిర్యాణం యావద్భారతావనికి తీర
కలిగించింది. గాంధీజీ సూత్రాలకు భాష్యం చెప్పి
నీయుడు లేనిలోటు ఇంతలో తీరేదికాదని ప్రధా
రాజెన్‌బాబు వంటి అగ్రనాయకులు చేసిన ప్రక
ఆయన నిర్యాణం దేశానికి ఎంత సంతాప కార
వూహించవచ్చు. ఈ వార్త తెలియగానే అన్ని రా
ప్రజలు సంతాపసభలు జరిపి ఈ మహానాయకుని
జలి సమర్పించారు.

ఇక ఆనాడు తెలుగు ప్రజలు పడిన ఆవేద
లేదు. ప్రతివ్యక్తి తన ఆత్మీయుని కోల్పోయిన
చారు. సామాన్య పౌరుడు మొదలు ముఖ్యమంత్రి
తడి పెట్టనివారులేరు.

అవును. అర్థశతాబ్దంపైగా తమ అభ్యు
అహర్నిశలు పాటుపడిన అకుంఠిత దేశభక్తుని
ఎలా మరచిపోగలదు?

ఇద్దరు మహానాయకులు :

ఈ చిన్న పుస్తకాన్ని ముగించబోయేముం
ప్రజలకొక ముఖ్యవిషయం స్ఫురణకు తేవలసివున్న

ఇంతకు ముందు పేజీలలో పేర్కొన్నట్టు
జాతిని నిద్రనుంచి మేల్కొలిపి జాతీయోద్యమం

ప్రముఖపాత్రను నిర్వర్తించేటట్టు సమాయత్తపరచిన వైతాళికులుగా ఇద్దరిని మనం ఎప్పుడూ జ్ఞప్తిలో వుంచుకోవలసి వున్నది వారే పట్టాభి, ప్రకాశంగార్లు.

నిజానికి వీరిద్దరిమధ్య చాలా భేదాలున్నాయ్. ఒకరు వైద్యులుకాగా మరొకరు న్యాయవాది. ఒకరు ఆలోచనాపరులుకాగా మరొకరు వుద్రేకి. ఒకరిలక్ష్యం కార్యసాధనకాగా మరొకరి మనస్తత్వం తాను పట్టినపట్టును ఏ పరిస్థితులలోను సడలించుకొనకపోవడం.

స్వభావాలలో ఇలా భేదాలున్నట్టే జీవితరంగంలో కూడా వీరిద్దరిమధ్య చాలా అభిప్రాయభేదా లేర్పడ్డాయి. అయితే అవి రాజకీయ సంబంధమయినవేగాని వ్యక్తిగతమయినవికావు. ప్రజాసేవ చేయడానికి అనుసరించదగుమార్గాలపై వచ్చిన విభేదాలేగాని స్వార్థంతో తల ఎత్తిన వివాదాలు కావు.

అందువల్ల వీరిద్దరూ ఆంధ్రజాతికి పూజ్యనీయులే. తెలుగుజాతి చరిత్రలో వీరిద్దరి పేర్లు సువర్ణాక్షరాలతో లిఖించబడగలవు.

)—(